చంద్రుపను తెచ్చివిభీషణు డంత వేడుకన్ । సమ్మతిసీతరాముడును సం
భ్రమునెక్కఁగ లక్ష్మణుండునున్ । ఇమ్మహీవానరాధిపులు యెక్కిరిదా
నవులు న్విభీషణుండుం । లెమ్మన జేయప్రార్థనను లేచటువంటిదూర
మున్ । బూచినవృక్షముల్ నదులు పూర్వతువచ్చిన త్రోవమార్గ
ముం । చూచినవార్థియింతికిని చూపుచు వేడుక లన్నిరాముడున్ । యో
చనచేసినందరను యోధులుగూడి ॥ ప్ర ॥ చేరిరిచిత్రకూటముకు చెల్వ
ముగారఘు రాముదేవుడుం । ధీరుడునై నయాభరతు దెప్పగబంపిరి మా
రుతాత్మజుం । గూరిమివిన్నవించినను కోరికెచెల్లెనటంచు సప్పుడున్ ।
ఆరయతల్లివచ్చిరటు లందఱుగూడి ॥ ప్ర ॥ తల్లులుతమ్ములుంగనియుదం
డములుం బిగికౌగిలింతలుం । బల్లవపాణిసీతకును పాదములందగ మొ
క్కరందరుం । జల్లనిజూపులుంజనులు సంభ్రమమై నడువంగవేడుక ।
లొల్లముగాగ దేవతలు ముచ్చటనొంద ॥ ప్ర ॥ వచ్చిరయోధ్యపట్టము
కు వాద్యములుం జెలగంగవేడుకన్ । వచ్చిరియిష్టభృత్యులును వానర
సేనలు గొల్వగామఱిన్ । వచ్చిరియిల్లుశొచ్చియును వారిజనాభుడు కొ
ల్వదీర్పగా । వచ్చిరిదేవసంఘములు వర్ణనజేయ ॥ ప్ర ॥ రాముడుసీ
తగూడుకొని రంజిలుచున్ మణి పీఠమందునుం। బ్రేమతోనున్ననందరును
బ్రీతియొనర్చుచుగొల్చుచుండగా । రామునిజూడవచ్చిరట్లు రాజకుమా
రులు బంధువర్గముం । భూమిలోనున్నయాప్రజలు పొందుగరాగ ॥
ప్ర ॥ గురువువశిష్ఠుకౌశికుడు కూరిమితోడుత ఋశ్యశృంగుడున్ । వరు
సమునీంద్రవారలును వచ్చిరిరాముని జూడవేడుకన్ । సరసులురాజవల్ల
భులు సత్కులజాతులు బంధువర్గముం । గరుణతోవచ్చియాజనకు గ్ర
క్కునజూడ ॥ ప్ర ॥ పరుబిడిబ్రహ్మనారదులు పార్వతిగూడి సదాశివుం
డునుం । మరిశచిదేవియింద్రుడు విమానము లెక్కియువేడ్కజూచుచున్
మెరువడరంభయూర్వశియు మేనకయుందగ నాట్యమాడుచుం । దరు
ణులుగూడి వారుమరి తల్లగయుండె ॥ ప్ర ॥ కిన్నరయక్షగంధరులు కీ
ర్తనపాడగ నష్టదిక్కులుం । చెన్నగమంసలానైపులు చంద్రుడు సూ

ర్యాడు దేవదానవుల్ । కన్నులఁజూచిపుత్రులను కాంక్షయుదీర్చగ గన్న
తండ్రియుఁ । వన్నెలుమీరవచ్చెనట వారిజనాభ ॥ ప్ర ॥ మింటమ్రో
దంగభేరులును మిక్కుటమై చెలఁగంగనిక్కటం । దంటబలియ్యమేళములు
దప్పెటబూర గపిళ్ళగ్రోవులుం । మింటనుగప్పపుష్పములు మేదినియా
ముని వేషభాషలుఁ । నట్టుజెంగికార్భటము లందనుగూడి ॥ ప్ర ॥ వీథు
లలంకరించిరటు విప్రులురాజులు వైశ్యశూద్రులుం । వీథులతోర
ణంబులును వింత వినోదములైన చోద్యముల్ వీథుల పచ్చ కస్తురి
యు వేడుకగామరి వేదవాద్యముల్ ॥ వీథుల వీథులం బ్రజలు వేడ్క
లు సేయ ॥ ప్ర ॥ ఏనుగులుం రథంబులును నెక్కు తురంగమముల్
మహోష్ట్రముల్ । మానగపమ్మదంబునను మంత్రులుచాల పదాతివర్గ
ము । వానరసేనలుంమఱియు వాలిలోభేదము భల్లుకంబులం । దానవ
మూకలుంగదసి తలఁకయుండె ॥ ప్ర ॥ అప్పుడయోధ్యపట్టమున న
న్నిటనొప్పియు రాజధానియై । యెప్పుడుజూచిసంభ్రమని యెవ్వరినె
వ్వరి తాముజూచుచు । నప్పుడునందుకాంతలునునందముజూచినచం
దమామనుం । దప్పులుబట్టువారు పరతంత్రులుగారె ॥ ప్ర॥ అందువశిష్ఠ
కౌశికులు నత్రిమహామును లైనపెద్దలుఁ । నందరుగూడిరామునకున
న్నిటమంచిదినంబుజూచియుం । బొందగచైత్రశుద్ధమున పూనిమహా
ర్ణవమందువేడుకఁ । నందరుజూచిపట్టమును ధీరతకాసపు డాంజనే
యులుం । ముచ్చటపూర్ణకుంభముల ముందరగామును లంతగూడుక
న్నచ్చటసీతరాములకు నందరుగూడభిషేకమప్పుడుఁ । హెచ్చుగజేయు
వేడుకలు యెంతనిజెప్ప ॥ ప్ర ॥ కట్టిరిభాషికంబులను కంజదళాక్షికి రా
మభద్రికుం । బెట్టిరిచేతముద్రికలు భీకరమై జగమంత వెల్గగా । పట్టిరిఛ
త్రచామరలు పార్శ్వమునన్నతి భక్తితమ్ములుం । గట్టిరిచేతకంకణము
కావుమటంచు ॥ ప్ర ॥ భరతుడు లక్ష్మణద్వయులు భక్తిప్రసక్తిని గొల్చి
నిర్భయుం । హరికరుణాకటాక్షమున నప్పుడుతమ్ములు నానందించిరం । ద
రుములునచ్చిపీకను తాలిమిసేవలు సేయుచుండగా । నియపుననుండిరి

ప్రేమున నిద్దురగొల్వ ॥ ప్ర ॥ సన్నిధినున్న యట్టి కవుసల్యకునైకకు మొ్రొక్కి రప్పుడుం। నున్నతమౌ సుమిత్రికును నొప్పగదంపము బెట్టిరందరుం సన్నముభక్ష్యభోజ్యములు నందరుగూడుక నారగించియు। స్వన్నిట తృప్తులైసుఖము లనుభవమంద ॥ ప్ర ॥ గురువులకున్ మునిప్రముఖు లో టికి రాముడు మొ్రొక్కినిల్చియుం। నరయక మీకటాక్షమున సన్నిశుభం బులు గల్గెనేడుకన్। వరుసతో వచ్చినందరికి వస్త్రధనంబులు చాలినట్లు గా - సరసిజనాభుడప్పుడును సమ్మతిబంపె ॥ ప్ర ॥ గురువునశిష్యుడతిప్రము ని కూటములెల్లను వేదమూర్తులై। పరజనపోషకుండుజన భక్తుల పాలిటిసీతరాముడుం। బరజనపోషులై పతిత పావనులై యిల యేలురా జుగా। వరమునిరాముతోననుచు వర్ధిలుచున్న ॥ ప్ర ॥ సీతనుగూడిరా ముడును చిత్రజుకేళిలో లోలలాడుచుం। ప్రీతిగనుండిరిద్దరును ప్రేమ స్సునుంచి సమానసౌఖ్యులై। ఖ్యాతిగతమ్ములందరును కాంతలగూడి సు ఖంబునొందియున్। సీతసురామచంద్రులకు సేవయుజేయ ॥ ప్ర ॥ దయ గలవాడుభానుకుల ధన్యుడురాముడు రాజ్యమేలగా ॥ భయమును లేదు కల్మియెడ బాయమునన్నిట భాగ్యముల్ మరిన్। ప్రియమునుధర్మముల్గ డిగి ప్రేమబెనంగి మహావిభూతులై। ప్రియసఖులున్ సఖిజనులు ప్రేమ తోగూడి ॥ ప్ర ॥ అట్టిదయాపరుండవని యంజలిజేసితి నన్నుగావుమీ। గట్టిగయెంత లేదనక కంజదళాక్ష కటాక్షమిప్పుడుం। బట్టిననాదుదుర్దశ మ్ము పారగనొట్టి భయంబుదీర్చుమీ। చుట్టము లేదునాకుమరి చుట్టము వే ॥ ప్ర ॥ దాసజనానుపోష ధనదాయక నాయకరావె కావవే। ఈ సమయానసీకరుణ యుంచకబ్రోవుమి జాగుసేయకే। దాసునుదాసదా సుడను ధన్యునిగాననువేగజేయవే। నాసరివారిలోననను మన్ననజేయు ॥ ప ॥ శ్రీకరుడైనరామునకు సీతకుప్రీతిగ పద్యవాద్యముల్। ప్రాకట మైనవై భవము భాగ్యములంగల రీతిజెప్పితిం। చేకొనినిత్తగింపునను చా ల్పముగానెడ బాయకుండుమీ। లోకములోనసీ వెగతి లోలుడవైన ॥ ప్ర ॥ మంగళమౌనురామునికి మంగళమౌమము గన్నతల్లికిం! మంగళ

మహానులక్ష్మికిని మంగళమహామము గన్న సీతకున్ । మంగళమానుజానకికి మంగళమహామము బాయకుండుమీ । మంగళమాను యిద్దరికి మమ్మునుగావు ॥ ప్ర ॥ ఛందములక్షణంబెఱుగ జెప్పితినేక వనంబుకొద్దిలో । నిందునదప్పులుంగనియు నిష్టముచేసుక చిత్తగింపుమీ । యందరిపాదసేవకుడ నచ్చనపుత్రుడ నారసింహుడన్ । వందనమయ్యకౌలకును వారిజనాథ ॥ ప్ర ॥ రాజులమేటిరాజరఘు రాజమహాత్ముడు రాజమాన్యుడై । రాజితకీర్తిశాలియగు రాముడురాజ్యాభిలాషసక్తుడై । యీజగమేలురాజులకు నిష్టజనంబులు సింహాసనార్చమా । భూజనభక్తరక్షకుడయి భూతిదలంచె ప్రసన్నరాఘవా ॥

ప్రసన్నరాఘవశతకము.

సంపూర్ణము.



శ్రీవేంకటేశ్వరవిద్యాసాగర ముద్రాక్షరశాల.

# ప్రకటన

గోదావరిజిల్లా కాకినాడనగరం పత్రివారివీధి పెద్దమసీదుకు పశ్చిమమునున్న మంగు వెంకటరంగనాధరావుగారి నె1862రు యింటియందుండు శ్రీ వెంకటేశ్వర విద్యాసాగర ప్రెస్సునందువిక్రయించబడుగ్రంథములు.

హెడ్డింగుకైఫువి.

శుకరంభా సంవాదం, సుమతి, నరసింహా, వెంకటాచలపతి, భళిరకరివేల్పు, శతకములు. సీతాకల్యాణం యక్షగానం, దసరాపద్యములు, శ్రీరామవిన్నపం, సీతసమర్త, యజుర్వేద సంధ్య, పుష్పబాణవిలాసం, తవాక్యం, కృష్ణజననం, ఆంజనేయదండకం, గజేంద్రమోక్షం శ్రీహరివిన్నపములు, దశరత్నములు, నిట్టలప్రకాశంగారికీర్తనలు, మంత్రం, ఫస్టుప్రైమరు సీతాకల్యాణంపాట, అరసవిల్లి సూర్యనారాయణదండకం, భర్తృహరి, పెద్దకుచ్చెలకథ, శ్రీకృష్ణభక్తసంవాదము

# ప్రచురపత్రిక

## పుస్తకవ్యాపారస్థులకు

గోదావరిజిల్లా కాకినాడనగరం పత్రివారివీధి నె 1862రు యింటియందుండబడిన శ్రీవేంకటేశ్వర విద్యాసాగర ప్రెస్సునందు రకముల తెలుగుకైఫులతో అనేకరకముల గ్రంథములు ముద్రించి విక్రయించుచున్నారము. గ్రంథములయందు తప్పులుండి కాగితములు దళసరివి శ్రేష్ఠమైనవి ధరలు చవుక యిదిగాక వర్తకులకు కొన్ని కావు సమయములయందు కేవలము కొన్నిరకములే అమ్మకమునకు జమాలైవుండును అన్ని యేరకంగ్రంథములు యేఅచ్చుతో యెన్ని దినములకు తప్పుచేయుమంటే ఆ ౧౮౦ వ్వగలము పేపరునకైనా ప్రాస యెప్పుడు ప్రెస్సువారివద్ద నిల్వయుండును. ॥

మంగు వెంకటరంగనాథరావు.

ఉ॥ శ్రీరఘురామసర్వసుర ♦ సేవితభవ్యవికుంఠధామ సం
సారసముద్రతారణసు ♦ సాధన నిర్మలనామదృప్తబృం
దారకవైరివీరచయ ♦ దారణకృత్ప్రదరౌఘభూమవం
దారుజనాభిరామఖర ♦ దానవమర్దన శ్రీజనార్దనా॥ ౧౭

ఉ॥ శ్రీరఘువంశసంభవవ ♦ రేణ్యవిదారితదైత్యసైన్యబృం
దారకమాన్యభక్తవర ♦ దాయకధన్యనృపాగ్రగణ్య దు
ర్వారదురంతచాపఘన ♦ రావవిరాజితజన్యదుష్టదో
స్సారవిభీత సాధుజన ♦ సంఘశరణ్యహరీజనార్దనా॥ ౧౮

ఉ॥ శ్రీరమణీపతీబలవ ♦ శీకృత ధూర్జటిపూర్వదిక్పతీ
వీరశుభాకృతీ త్రిపుర ♦ భేదితురంగ సురద్విపాత్రిరా
ట్స్ఫారదనీరదేందు కరి ♦ శాత్రవడింబ తుషారమల్లికా
హారమరాళ రాజధవ ♦ ళాయుతకీర్తియుతీజనార్దనా॥ ౧౯

ఉ॥ దారుణకైటభాసురవి ♦ దారణశంకర పద్మజాదిబృం
దారక తాపవారణబు ♦ ధస్తుతికారణ భక్తమానవో
త్తారణ కీర్తిపూరణస ♦ ధర్మవిచారణ కుంభకర్ణదు
ర్వారసురారి మారణవి ♦ రాధకృతాంతనమోజనార్దనా॥ ౨౦

ఉ॥ శ్రీరఘువంశ వీరఘన ♦ సింధుగభీర కపీంద్రసైన్యవి
స్ఫారసుమేరుధీర భవ ♦ పాతకసంఘవిదూర దీనమం
దార దురాపజారవస ♦ దప్రతిమానశరీర వైరికాం
తారకుఠార యవ్యయపద ♦ ప్రవిహారహరీజనార్దనా॥ ౨౧

ఉ॥ దారుణదైత్యమేఘసము ♦ దాయసమీరణ మానిచిత్తసం
చారణసర్వలోకహిత ♦ శాసనకారణ భక్తలోకసం

తారణ పీతవస్త్రపరి ♦ ధారణ రావణకంఠపంక్తిని
ర్వారణ సర్వపాపచయ ♦ వారణ వామన శ్రీజనార్దనా॥ ౨౨

ఉ॥ శ్రీరమణీకళత్ర యత ♦ సీసుమరాజితగాత్ర సర్వబృం
దారకగీతిపాత్రవిన ♦ తప్రికరాంబుజ మిత్ర ఘోరసం
సారలతాల విత్రనవ ♦ సారసపత్రికనేత్ర సంస్తుతో
దారచరిత్ర శత్రుచయ ♦ దారుణజైత్రహరీజనార్దనా॥ ౨౩

ఉ॥ శాంతతపోధనేద్వనవ ♦ సంతనితాంతయశఃపరిపూరితా
శాంతపయఃపయోనిధిని ♦ శాంతవిదేహ సుతాసతీమనః
కాంతపదబ్జనమ్రనర ♦ కాంతఫణీంద్ర ఫణాళవాసవి
శ్రాంతఘటశ్రవోశ్రపవి ♦ శాంతపరంతప శ్రీజనార్దనా॥ ౨౪

ఉ॥ అంకితకుండలాదిమకు ♦ టాంకధరాతనయా విరాజివా
మాంకసురూపనమ్రమక ♦ రాంకపరిభ్రాంతభానుమత్సహ
స్రాంకకపాలిసంస్తుతమ ♦ హాంకసుదర్శన ధూతదంతిరా
డంకని మేషశోషితన ♦ తాంకవరాంకహరీ జనార్దనా॥ ౨౫

ఉ॥ శంకరపద్మజాతహరి ♦ సైంధవ సంస్తుత తారకాంకని
శ్శంకభృగూద్వహోద్ధతిస ♦ శంకరరంకవిశంకటాహిప
ర్యంకనిజాస్యనిర్జితశ ♦ శాంకఖరోపలటంకవైనతే
యాంకదశాస్యకంఠతృటి ♦ తాశ్రితపంకహరీజనార్దనా॥ ౨౬

ఉ॥ హారపటీర హీరహర ♦ హారతుషారతుషార ధామనీ
హారక రాజిపారద శ ♦ తారకతారక పద్దికుందమా
దారసితారవిందభక ♦ డంబకపాండురకీర్తిసారసం
భారముసీంద్రభక్తపరి ♦ పాలనపావన శ్రీజనార్దనా॥ ౨౭

చ॥ బలము దొఱంగి చేవచెడి ♦ ప్రాయమువ్రాయియొడల్వడంకిక
న్నులనువృదప్పిదంతములు ♦ నుగ్గగు వేళను మానవాళినీ
సలలితనామ సంస్మరణ ♦ సల్పిన వింతయె ప్రాయమప్పుడేఁ
దలఁతుభవత్పదాబ్జముల ♦ దాసునిఁగావవె శ్రీజనార్దనా॥ ౨౮

ఉ॥ దారుణపాపవారినిధి ♦ దాటఁగనావయనంతదుఃఖసం
సారదవానలార్చికివి ♦ శాలసుధామయవృష్టిధారతా
ఘోరగవర్గముందఱుమ ♦ నుగ్రఖగేంద్రునిశక్తియంచునీ
తారకనామముందలఁతు ♦ దానవమర్దన శ్రీజనార్దనా॥ ౨౯

ఉ॥ ప్రాణవియోగవేళనుభ ♦ వత్పద పంకజ చింతనంబునే
మానకసేయఁగల్గుదునొ ♦ మానుదునో తెలియంగఁబోలునే
కానరఘూత్తమాయిప్పుడె ♦ గానముసేయుదు నీమహత్త్వమున్
దీనునినన్నుఁగావుమువి ♦ దేహసుతావర శ్రీజనార్దనా॥ 3౦

ఉ॥ పామరులైన నీపరమ ♦ పావన నామముసంస్మరింపనీ
ప్రేమకుఁబాత్రులౌదురని ♦ పెద్దలుసెప్పఁగఁగాంచి భక్తినీ
నామమునారతంబుమది ♦ నాటఁగఁజేసితినయ్య భక్తచిం
తామణియెట్లుగాచెదవొ ♦ దానవమర్దన శ్రీజనార్దనా॥ 3౧

ఉ॥ నీదుమహత్త్వముందెలుప ♦ నీరజగర్భగురూరగాధిపుల్
సాదరవాక్యకౌశలిర ♦ వంతయుఁజాలరసంగనాకునిం
తేఁదరమేనుతింపనిను ♦ నేడసృగాలమునాకమేడనన్
వాదముగాంచమేభువిని ♦ భక్తజనావన శ్రీజనార్దనా॥ 3౨

చ॥ దశరథ నందనుండవయి ♦ తాటకఁదున్మిసుబాహుఁ గూల్చియా
బసవనిరౌతుకార్ముకము ♦ వంచియుదారతఁదండ్రిపంపునన్

భృశగతి దండకాటవికి ♦ నేగి ఖరాసురుఁగుంభకర్ణునిన్
దశముఖుఁగూల్చితీ వెకద ♦ దానవమర్దన శ్రీజనార్దనా॥ 33

ఉ॥ భూపలలామనిన్ను మదిఁ ♦ బూని సదాభజియించు మానవుల్
పాపులెయైనఁబూర్వ మున ♦ వారలపాపపుఁగొండ్లయిల్లిఁకన్
నీపద భక్తివాతహతి ♦ నిల్వఁగనేర్చునె నాల్గుదిక్కులన్
రూపరిమాయకూడ భవ ♦ రోగభిషఙ్మణి శ్రీజనార్దనా॥ 38

ఉ॥ ప్రాపుగనీదునామమును ♦ బాయకధ్యానముసేయు వారికిన్
బాపముపొవునంచు దవ ♦ వహ్నిని నేపునమ్రింగవచ్చుబల్
ల్పాఁపదొరన్ మృణాళముగఁ ♦ బట్టఁగవచ్చుమహేశలోచనా
టోపముమాన్పవచ్చును ప ♦ టుష్కరణంబున శ్రీజనార్దనా 3౫

చ॥ చరణముసోకినంత శిల ♦ జవ్వనియయ్యె మరామరాయనన్
వరమునియయ్యె నొక్కరుఁడు ♦ వారిధిఁగట్టెను వానరావళుల్
శరనిధిలోనఁదేలెగిరి ♦ సంచయమప్పుడు నీమహాత్త్వమున్
దరమె నుతింపమాకు ఖర ♦ దానవసూదన శ్రీజనార్దనా 3౬

ఉ॥ చండరిపుప్రకాండబల ♦ షండవి ఖండనమాడితేషుకో
దండకళాప్రచండ భుజ ♦ దండుడవయి దశకంఠకంఠముల్
భండనభూమిఁజక్కడఁచి ♦ భక్తజనావళి నేలినట్టియు
ద్దండుడవైన రాముఁడవు ♦ దైత్యవిమర్దన శ్రీజనార్దనా॥ 3౭

ఉ॥ దీనశరణ్యుఁడంచు నలు ♦ దిక్కులమిక్కిలి పిక్కటిల్లి పెం
పూనఁగయాచకావళికి ♦ నొప్పగు కొంగుపసిండి యేయునన్
దానవిధాన కల్పకమ ♦ నన్గడుఁ గీర్తివహించు నిన్ను నేఁ
గానఁగ వచ్చినాఁడవడి ♦ గా ధరణీరమణా జనార్దనా॥ 3౮

ఉ॥ దీనులఁ గావఁ గంకణము ♦ దీరతదాల్చినవాఁడవంచు నే
దీనుఁడనంచు నీమఱుఁగు ♦ దిక్కని చొచ్చితి దీనమానవా
ధీనవయాధురీణనను ♦ దీనునిఁ గావవె చూడ వేకృపన్
ధ్యానకళాప్రవీణ భవ ♦ తాపనివారణ శ్రీజనార్దనా॥ ౩౯

ఉ॥ కోరినవాంఛలెల్లసమ ♦ కూర్చుచుఁ బ్రోచెడితండ్రి తన్ను వే
మారుస్మరింపనాపదల ♦ మాన్పువిభుండు కరంబులొగ్గినన్
మారువచింపకన్నియును ♦ మానకయిచ్చెడి దాతయంచు నిన్
జేరిభజించియూడిగము ♦ సేయుచునుంటిని శ్రీజనార్దనా॥ ౪౦

ఉ॥ రాతినినాతిఁ జేసియుఁ గి ♦ రాతునిఁ బ్రోచిజగానఁ గోఁతిక
త్యాతతరాజ్యమిచ్చి కరు ♦ ణాంబుధివై యుడుతన్ గరంబులన్
ఖ్యాతిగదువ్విపక్షికప ♦ వర్గమునిచ్చి యరాతిఁ గాచునీ
ఖ్యాతినిఁ గాంచివచ్చితిన ♦ యారఘుసత్తమ శ్రీజనార్దనా॥ ౪౧

ఉ॥ మామకపాపబృందముల ♦ మాన్పఁగదే రఘురామ రామశ్రీ
రామభవత్పదాబ్జముల ♦ వ్రాలితి వే రొకవేల్పుఁ గొల్వనీ
నామమె సంస్మరించెదను ♦ నన్నిఁక నేగతిఁ గాచెదో కృపా
ధామశమాభిరామఖర ♦ దైత్యవిమర్దన శ్రీజనార్దనా॥ ౪౨

ఉ॥ అట్టిటుఁ జూడకుండ శర ♦ వార్ధులఁ గాచుట నీకు వెన్నతోఁ
బెట్టిన విద్యయేకదవి ♦ భీషణు రావణుతమ్ముఁడంచు లోఁ
బెట్టకప్రోవవైతివఁట పేరిమి ♦ తోడుత నన్నుఁ గూడఁ జే
పట్టవె యావిధంబుననె ♦ పాతకమర్దన శ్రీజనార్దనా॥ ౪౩

ఉ॥ ఆగమవేద్యసర్వశర ♦ ణాగతరక్షణ సువ్రతాఢ్య సీ
తాగజగామి నీరమణ ♦ తాపసపోషణ సత్యభాషణా

నాగశయాన నిన్నె మది ♦ నమ్మితి సర్వమునీవె నాకునీ
వేగతి పోవ వేరఘుప ♦ తీనృపతీ సుకృతీ జనార్దనా॥ ४४

చ॥ వనరుహనాభదీనజన ♦ వత్సల విన్నపమాలకింపుమీ
ఘనమగునీభవాబ్ధిఁబడి ♦ కంపమునొందుచు నీవలేకని
న్ననయముఁగొల్చి నీదుచర ♦ ణాబ్జములంబడినాఁడ మోక్షసా
ధనమును జూపవే కరుణఁదాసునిఁ ♦ గావవె శ్రీజనార్దనా॥ ४५

చ॥ అగణితమైన నాదుదురి ♦ తావళి మానసవీధినగ్గలం
బగుపరితాపముంబొరయ ♦ నాధులొనర్చుచునున్నదయ్యనా
వగలను మాన్పి పాపములఁ ♦ బాయఁగఁజేయవె కావవేకృపన్
దగదని చిత్తమందిడక దైత్యని ♦ షూదన శ్రీజనార్దనా॥ ४६

చ॥ అభయము జానకీశయభ ♦ యంబువిభీషణరక్షణవ్రతా
యభయమురావణారియభ ♦ యంబుఖరత్రిశిరోవిమర్దనా
యభయము పద్మనేత్రయభ ♦ యంబుమహేశ్వరచాపఖండనా
యభయముచక్రపాణియభ ♦ యంబభయంబు హరీజనార్దనా॥ ४७

ఉ॥ భావచవాభియాతినుత ♦ భాసరవంశపయోధిచంద్రనిన్
దైవముతల్లితండ్రియును ♦ దాతగురుండు భిషగ్వరుండుగా
భావనసేయుచుంటిననుఁ ♦ బాలనసేయవెకావవేజగ
త్పావనమూర్తిదాశరథి ♦ దానవమర్దన శ్రీజనార్దనా॥ ४८

ఉ॥ నందితవందిబృందరఘు ♦ నందనత్వచ్చరణారవిందని
ష్యందమరందబిందు చయ ♦ సంచితపానముగాదె విందుసా
నందపురందరాబ్జజన ♦ నందనవందితభక్తమానసేం
దిందిర రాజసంతతికి ♦ దీనజనావన శ్రీజనార్దనా॥ ४९

చ॥ జనకసభాంతరాళమునఁ ♦ జాపముభగ్నముగాఁగఁ జేయుచోఁ
గనదురుపంక్తికంఠవహు ♦ కంఠవిదారణముంబొనర్చుచో
వినిశితశస్త్రపాతమున ♦ వీకుఘటశ్రివుఁగాంచువేళలన్
గనినభవద్భుజాబలము ♦ కల్మినిగొల్చెద శ్రీజనార్దనా॥ ౫౦

ఉ॥ కామమదాది శత్రుచయ ♦ గర్వవిపాటన కారకంబుగా
భీమవిపన్నగోత్కరవి ♦ భేదనవజ్రనిశాతధారగాఁ
గామితసిద్ధిదానచణ ♦ కల్పమహీజనమంబుగాఁగనీ
నామమెసంస్మరించెదను ♦ నన్గుణింపవె శ్రీజనార్దనా॥ ౫౧

ఉ॥ వారిజనేత్రనిమ్నమానసయ ♦ వారితవిక్రమరావణాదిదు
ర్వారసురాభియాతికుల ♦ పర్వతవజ్రవినమ్రమానవో
త్తారణ దీక్షసంసరణ ♦ తారణకారణనామరామసీ
తారమణీమణీరమణ ♦ తాళవిభేదన శ్రీజనార్దనా॥ ౫౨

చ॥ శ్రితజన భాంధవుండు సర ♦ సీరుహపత్రవిలోచనుండు వి
శ్రుతశుభవర్తనుండు రవి ♦ సూతిసఖుండు రఘూద్వహుండుమా
రుతసుత సేవితుండు భవ ♦ రోగకసిద్ధభిషగ్వరుండు మా
పతియని సర్వదాగొలుతుఁ ♦ బాడుదునాకుదు శ్రీజనార్దనా॥ ౫౩

ఉ॥ సల్లనివాఁడు పాపముల ♦ నమ్మినవారల నెల్లరందగన్
జల్లగఁజూచి మేలు వెదఁ ♦ జల్లెడువాఁడు కృపారసంబు జా
బిల్లెకు వాఁడు కొల్లలుగఁ ♦ బెక్కువరంబు లొసంగువాఁడు శ్రీ
వల్లభుఁడంచుఁ జెప్పఁగని ♦ వచ్చితిఁగావుము శ్రీజనార్దనా॥ ౫౪

ఉ॥ శ్రీయుత జానకీరమణ ♦ శ్రీధర కేశవ కృష్ణరాఘవా
తోయజనాభరామఖర ♦ దూషణవైరి నృకేసరీజగ
న్నాయకదేవ దేవహరి ♦ నారదవందిత పాహిపాహినా
రాయణ దీనరక్షణప ♦ రాయణవామన శ్రీజనార్దనా॥ ౫౫

చ॥ శరణనఁగా విభీషణుని ♦ శత్రుకులోద్భవున్నైన నేలవే
మొఱలిడివచ్చినట్టి సుర ♦ ముఖ్యునిఁ బ్రోవ బలీంద్రువేఁడవే
నిరతము పాహిపాహి యని ♦ నేనిటకుయ్యిడ వేగరాగదే
కరివరరక్షకా శరణఁ ♦ గావవె చూడవె శ్రీజనార్దనా॥ ౫౬

ఉ॥ దీనుఁడనై ననాకుధర ♦ దిక్కిఁక నెవ్వరు రాజసింహ నీ
వే నిజమైన దిక్కనుచు ♦ నెంచి నినున్ శరణంబు వేడితిన్
గానక్షమించి నన్నిపుడు ♦ కావవె నాదు మొఱాలకింపరా
దేననుఁబ్రోవ వేతలఁప ♦ వేరఘునందన శ్రీజనార్దనా॥ ౫౭

చం॥ శరణుసనాతనా శరణు ♦ సామజరక్షణ పక్షివాహనా
శరణుమఖావనా శరణు ♦ సంయమిపోషణ సత్యభాషణా
శరణుకృపాధనా శరణు ♦ శశ్వదరోషణ పాపశోషణా
శరణుమహోరణా శరణు ♦ సంస్తుతిభూషణ శ్రీజనార్దనా॥ ౫౮

ఉ॥ అంబుజమిత్రసూతిపయి ♦ నంజనపుత్రునిపై మదోద్ధురే
భంబుపయి న్విభీషణుని ♦ పై శబరీసతిపై నహల్యపై
నింపుగఁజూపినట్టి దయ ♦ నెప్పుడు నాపయిఁ జూపు నీదు పా
దంబుల నమ్మినాఁడ సత ♦ తంబును రాఘవ శ్రీజనార్దనా॥ ౫౯

ఉ॥ నమ్మితి మిమ్మునిమ్ముగను ♦ నమ్మనయందనయమ్ము నీదున
త్తమ్ములతమ్ముకాననుఁ ♦ దమ్ములఁ గమ్మగఁగ్రమ్మునమ్మరం
దమ్మునహర్నిశమ్మును ముఁ ♦ దమ్మునఁ గ్రోలుదు దీనపారిజా
తమ్మనునట్టినీబిరుదుఁ ♦ దప్పక కావవె శ్రీజనార్దనా॥ ౬౦

చ॥ శ్రితులకు భూషణంబులగు ♦ చున్ దనరారు భవత్కథావళుల్
సతతమువించు నీదుపద ♦ సంస్మరణంబున సంతసించునా
హతదురితౌఘపూతమను ♦ జాలికినానుదురంత మ్రొక్కెదున్
వితత విభీషణాగ్రభవ ♦ వీరవిమర్దన శ్రీజనార్దనా॥ ౬౧

చ॥ జనకసుతామనోవిమల ♦ సారసనందిత మిత్త్రబింభరా
సనకసనందన ద్రుహిణ ♦ జాతముఖార్చిత పత్కుశేశయా
వనరుహ బాంధవప్రకట ♦ వంశపయోనిధి తారకావరా
కనకవి భూషితాంగ మధు ♦ కైటభమర్దన శ్రీజనార్దనా॥ ౬౨

ఉ॥ ఓహరిసాహసింగదిసి ♦ హుమ్మనుచున్ వడిహుంకరించి పె
ల్లాహవభూమిఁ దాకిన ఖ ♦ రాదిములంబదునాల్గువేవురన్
బాహిరపోయిప్రాణములఁ ♦ బాయఁగఁ జేసితివౌరభీమ భ
ల్లాహతి నీవొకండవమ ♦ హాస్ఫురణంబున శ్రీజనార్దనా॥ ౬౩

ఉ॥ కంటిని నేభవన్మహిమఁ ♦ కన్నులపండువుగాఁగ నేడహో
వింటిని నీవృథవ్రితము ♦ వీనులవిందుగ పేల్పుపిండులో
నంటిని మేటివంచునిను ♦ నన్యులనేఁదరిఁ జేరనంటినీ
బంటులబంటనంటిని కృ ♦ పామతిఁ బ్రోవుము శ్రీజనార్దనా॥ ౬౪

చ॥ ఖరకరకోటిధామమున ♦ గ ప్రభవాసతతాభిరామమున్
సురరిపుసుందరీ సుగళ ♦ సూత్రవిరామముముక్తిధామమున్
ధరననతారి భీమమగు ♦ తావకతారకరామనామమున్
స్థిరముగనాదుజిహ్వను వ ♦ సింపఁగఁ జేయుము శ్రీజనార్దనా॥ ౬౫

ఉ॥ మేలుకడానిచేలమును ♦ మీఱుభుజంబును బిల్లవాలునున్
గేలనుబూని తేరుడిగి ♦ క్రీడికినిత్తుజయంబునిన్నిటన్
వ్రాలఁగనోర్తునంచు మిను ♦ వాఁకసిసుంగునుఁ జేరఁగట్టియ
వ్వేళమరల్పనొప్పు నిను ♦ వేఁడెదఁగావుము శ్రీజనార్దనా॥ ౬౬

ఉ॥ తుత్తుకనల్పు వేల్పుమదిఁ ♦ గొల్చునొయేనియదుంగుఁదామరల్
క్రొత్తహొయల్గలాడెవడు ♦ గొల్లమిటారుల సిగ్గుదోఁచెనో

సత్త్రపడంతియుంబలుకుఁ ♦ జక్కకనెవ్వని పేరునట్టినిన్
బత్తిఁదలంచుచుండెదను ♦ నల్లని దేవర శ్రీజనార్దనా॥ ౬౭

చ॥ వలమురిబిల్లవారుగుదె ♦ బాకును నందక వేల్పుఁజోఁజులన్
బిలువక లచ్చిదువ్వలువ ♦ పీడకసప్పపుసూడునూనకే
బలువడినేగి గొరుమను ♦ పన్ మొసలింబగఁ దెంచుజియ్యపూ
ములుకులదంట యత్యనను ♦ బోగ్రపుమునిచ్చలు శ్రీజనార్దనా॥ ౬౮

చ॥ జముఁనినిసుంగు జన్నమును ♦ సల్పెదు నప్పుడు పెద్దలందఱున్
దమలము సీకిడన్ గడఁగ ♦ దబ్బరలాడుగ రాసుదిట్టఁగ
య్యమునకుఁ గాలుదువ్వవడి ♦ నచ్చట నేపటుపుంగటారిచే
నిముసములోన మన్నిగొను ♦ నేడవునీవు హరీజనార్దనా॥ ౬౯

ఉ॥ కూరిమిదక్కి కంసుఁడును ♦ గొంటుతనంబున జెట్టిజోడుతన్
జోరుమఁటంచుఁజీరవెను ♦ బోవక యేడ్తెఱబల్తుపాసిపై
యీరసమొప్ప దేసముస ♦ నెక్కటిఁనామిడిమాసి మేఁటిజా
ణూరునిఁబట్టి మన్నిగొని ♦ నుగ్గుగఁజేయవె శ్రీజనార్దనా॥ ౭౦

ఉ॥ తాటిసిడంబు వానికిని ♦ దమ్ముఁడవయ్యు దురంపుగొండ్లినా
తాటిసిడంబువాఁడువడిఁ ♦ దాఁకుచుఁ గ్రిడినివాఁడితూఁపులన్
బాటిగనేయ వానిపయిఁ ♦ బర్బ్బినకిన్కనుబూనియేన
మ్మేటిదునీఁడ వేల్పులకు ♦ మించిననేడ హరీజనార్దనా॥ ౭౧

చ॥ చిలువలతేని సెజ్జపయి ♦ జెల్వొనఁ బండెదు నల్లవేలుపా
వలిమలయల్లుఁడున్నలువ ♦ బత్తినిగొల్వఁగ మీరునేలికా
పలుకువెలంది తేనిఁ గను ♦ పట్టగు పొక్కిలిగల్గుదేవరా
సిలుగులఁబాపుసామినినుఁ ♦ జేరితిఁగావుము శ్రీజనార్దనా॥ ౭౨

చ॥ కరువలికూనవేవెలుఁగు • కందునుఁ దోడుగరాగసంభ్రమున్
గరువమడంచి గుబ్బలుల • గట్టిపదంపడి సోఁకుమూఁకలన్
ఇఱచుచు వేఁటుపుల్ తవిసి • సాములుఁ జేసెదు జోతలందునిన్
మురిపెముతోడఁ గొల్తునను • బ్రోవుము రాఘవ శ్రీజనార్దనా॥ ౨౩

చ॥ సిరివిరిబోఁడి ఱేఁడ నినుఁ • జేరినవారలఁగాచుఁ బ్రేలుపా
యరపతిమోములున్న దొర • దైనవిలుంగడు నెల్లిదంబుగా
విఱిచినదిట్టరక్కసుల • వింటికిఁబంపెదు మేటిదేవరా
గరుడిని నెక్కుసామి ననుఁగావుము నిచ్చలు శ్రీజనార్దనా॥ ౨౪

ఉ॥ కమ్మనివింటిబోయ సెక • కంటను వ్రేల్చిన వేల్పు బమ్మయున్
బమ్మిన వేడ్కతోడ బలు • బత్తిని నిచ్చలుఁ గొల్చునట్టి న
త్తమ్ములబోలు నీయడుగుఁ • దమ్ముల నాయెదఁ బాదు కొల్పితిన్
నమ్మితి నాకు దిక్కనుచు • నల్లనిదేవర శ్రీజనార్దనా॥ ౨౫

ఉ॥ చుక్కల ఱేనికిన్మఱది • సోఁకులఁగొట్టెడు దిట్టసాదులన్
మక్కువఁబ్రోచు సామియెల • నాగలపాలిఁటి కమ్మవిల్తుఁడా
మిక్కిలికంటిదేవరకు • మిన్నజగంబుల నేలు నేలికా
మ్రొక్కెదఁగావవే ననుస • రోరుహలోచన శ్రీజనార్దనా॥ ౨౬

ఉ॥ అంచహలుమాయిజోదుచెలి • నాకసపున్ సిగవానివీటినిన్
మంచులగుబ్బలిన్మగుని • మామను వేల్పుల వారువంబునున్
మించుచు నుద్దిలేనిదయి • మీఁజగంబులనిండియొక్కఁడై
కాంచఁగనొప్పు నాయనముఁ • గన్నదనీఁడవు శ్రీజనార్దనా॥ ౨౭

ఉ॥ దండిమగంటిమింగలనఁ • దాఁకినసోఁకులమొత్తముల్ వడిన్
జెండికలంచిబత్తులకుఁ • జెచ్చెరఁజొచ్చెదునంపపిండుచే
గండుతనంబునన్మగులఁ • గ్రాలెడు వేలుపలచ్చిదాలుపా
మెండుగ నేటి కోళ్ళకుడు • మీఱినబత్తిని శ్రీజనార్దనా॥ ౨౮

ఉ॥ మీఱుచుఁ జివ్వ నిండ్రజియు ♦ మించినవిన్కలికంటిచిల్కలన్
బాళిఁగ నేయ బీతునకుఁ ♦ బాల్పడి యావిసదారి కట్టులన్
మీఱనుఁగట్టఁగా బడుట ♦ మేలము సూపఁగ నెంచి కాదె నీ
పేరయి మేటివేల్పవుజో ♦ హారువు కావుము శ్రీజనార్దనా॥ ౭౯

చ॥ సిరియొకిమీఁడ పల్వాలను ♦ జింకలఁ గొట్టెడి వేఁటకాఁడ పెన్
దురముననేరయి ద్రిమ్మరుల ♦ దూఫ్రులః దుంచెసి ప్రోసకట్టికిన్
మురిపెపుసంగడీఁడనలు ♦ మోములసామినిఁగన్న తేఁడబల్
సెరగులసూడఁగొంట్లపువ్వు ♦ సింగిణికాఁడప రీ జనార్దనా॥ ౮౦

చ॥ జగములుపుట్టఁజేయఁగను ♦ సాఁకఁగఁజంపఁగ సత్తివాఁడనై
తొఁగలకుసూడు నెచ్చెలియు ♦ దోడుగఁగూడుచుఁగంటి దంటగా
మిగులుచు గాడ్పుమేఁతరుల ♦ వేఁటిని సెజ్జగఁబుగ్గఁ రాయనిన్
జిగిగల కత్తులానిగనుఁ ♦ జేసిన దేవర శ్రీజనార్దనా॥ ౮౧

ఉ॥ దండిమురంపు గొండ్లినర ♦ దంబును దోలుచునుండి కట్టిచే
గాండివమన్న సింగిణిని ♦ గ్రాలెడు కోలల సూడుపిండులన్
జెండఁగఁ సేయుజెట్టి నినుఁ ♦ జేరినవారలనోముదిట్టనీ
యండను జేరు నీయనద ♦ నారసి కావుము శ్రీజనార్దనా॥ ౮౨

ఉ॥ గట్టులచట్టుపల్ దెగఁగఁ ♦ గట్టిగ గొట్టెను జెట్టితాపరుల్
బిట్టుగ గొల్లకొట్టి కనువేసిన బీతుగలంగు గొల్లలన్
దిట్టతగుబ్బలిన్మ్రనిపి ♦ తెప్పరమాపిన గొల్లపిన్ననిన్
నిట్టనుగొల్చెదన్ గళిదు ♦ నీఁడరమాకమనా జనార్దనా॥ ౮౩

ఉ॥ కాన బిడారువారెవురు ♦ గారవమొప్పఁగ నేరెక్కలులన్
మాఁసకచేసియందులకు ♦ మాఱుగ నెవ్వని యిక్కనఁది పెం

పూనఁగ నెంతొ సంతసము ♦ నొందుదుకోయలనిన్ను నిచ్చలున్
బూనికతోడఁ గొల్చెదను ♦ బ్రోవుము నన్ను హరీజనార్దనా॥ ౨౪

ఉ॥ అమ్మకచెల్ల నీకొమరుఁ ♦ డర్మిలి దొంగిలుఁ బూపవెన్న బ
ల్కమ్మని పాలు ద్రాగునొడి ♦ కమ్మఁగ మమ్మఅచేసి మాపువున్
గొమ్మలనీసడించుఁగనుఁ ♦ గొమ్మనియందురు గొల్లెతల్ యశో
దమ్మకయారె నీబలుగ ♦ యాళి తనమ్ములు శ్రీజనార్దనా॥ ౨౫

ఉ॥ గొల్లమిటారు లాజమునఁ ♦ గోరికఁ దానములాడుచుండఁగా
నల్లనఁజేరి పుట్టముల ♦ నందినవాఁడవె యయ్యెఁబిమ్మిటన్
దల్లడమందు దోవదికిఁ ♦ దాల్పఁగ గింటెములిచ్చి నట్టి నీ
చల్లదనంబు నూచెదను ♦ సాఁకుము నిచ్చలు శ్రీజనార్దనా॥ ౨౬

ఉ॥ పొందుగ నల్లరోహిణికిఁ ♦ బుట్టియశోదకుఁ గంసవైతగన్
గందుని చందముం దెగడి ♦ కన్నవ విందగు నీదునందపుం
బొందికఁగాంచు గొల్లవువుఁ ♦ బోఁడుల డెందములందుఁగందుఁడిం
పొందఁగఁ బూవుములుక్కలను ♦ హుమ్మనిగుమ్మెడె శ్రీజనార్దనా॥ ౨౭

చ॥ సనకసనందనాది ముని ♦ సత్తములం దెలియంగఁ జాలరే
యని నుతువంగనాకుఁ ♦ దరమాయఅఁగంగఁద్వదీయ మాయనీ
వనజసమానపాదములె ♦ పాయకదిక్కని నమ్మియుంటినే
ననయము భక్తితో నృపవ ♦ రారఘునందన శ్రీజనార్దనా॥ ౨౮

చ॥ కరివతుఁడా తటాకమునఁ ♦ గాసిని జెంది త్వదీయనామ సం
స్మరణమొనర్ప నేగిరథ ♦ సంబునఁ జక్రముఁ బంపినక్రిసం
హరణముచేసికాచి శర ♦ ణాగతవత్సల నామధేయమున్
బరగఁగ నిల్పితీవెకద ♦ పాపవిమర్దన శ్రీజనార్దనా॥ ౨౯

ఉ॥ భోగిశయానరామవరి ♦ పూర్ణకృపాంబుధిరామచంద్ర నీ
తాగజగామినీశవర ♦ దాయకవేఱొకనిం దలంప నీ
వేగతి చూడవేతలఁప ♦ వే శరణార్థినినన్నుఁ గావవే
వేఁ గరుణింపవేమనుప ♦ వేరఘువల్లభ శ్రీజనార్దనా॥ ౯౦

చ॥ ఖరకరవంశమండనయ ♦ ఖండితమైన త్వదీయనామసం
స్మరణమొనర్ప లోపములు ♦ మాయవె కల్గవె వైభవోన్నతుల్
దురితపు సంఘముల్ దొలఁగి ♦ దూరములై చనకుండునే శచీ
వరుపదమబ్బకుండెడునె ♦ పంచజనాళికి శ్రీజనార్దనా॥ ౯౧

చ॥ చందురుఁ గేరు నెమ్మొగము ♦ చల్లనిచూపు మిళిందబృందమున్
గుందఁగఁ జేయు వేణియును ♦ గుందరదంబులుఁ గమ్మఁదేనియల్
జిందెడుపల్కులున్ మెఱుఁగుఁ ♦ జెక్కులు నల్లని మేనుఁ గల్గు నీ
సుందరరూపమున్మదిని ♦ జూచెద నెప్పుడు శ్రీజనార్దనా॥ ౯౨

ఉ॥ దీననమన్నిధానమును ♦ దీర్ఘభవానలతప్తశీతల
స్నానము నారదాదిముని ♦ సంచయగానము మోక్షసాధసో
పానము భక్తకోట్యమృత ♦ పానము నాచు నెసంగు నీపద
ధ్యానమొసంగి నీకు నను ♦ దాసునిఁ జేయవె శ్రీజనార్దనా॥ ౯౩

చ॥ తరణినిశాకరుల్ గతులు ♦ దప్పరు వారిధి మీఱి రాదు ది
క్కరులు కలంతనొందవుర ♦ గప్రవరుండు వడంకఁడేమియున్
విరమతిలేక వాయువులు ♦ వీచును దీనికి గారణంబు నీ
విరచితమైన సృష్టిగద ♦ విశ్వజనావన శ్రీజనార్దనా॥ ౯౪

ఉ॥ గాలమునాసమింగు ఝష ♦ కంబువిధంబుఁ గరాళకీలలన్
వ్రాలుచు మాడిమ్రగ్గుశల ♦ భంబు విధంబును గాదె మానవుల్
బేలతఁ గామమోహములఁ ♦ బీడితులై భవవారిరాశిలోఁ
గూలుటమీఁదెఱుంగమని ♦ గోపకులావన శ్రీజనార్దనా॥ ౯౫

చ॥ సరసిజనేత్ర భానుకుల ♦ సాగరచంద్రమ దీనపోష శా
ఖరవర కుంభకర్ణ దశ ♦ కంఠము భాసురజీవితావహా
శరనిధి గర్వసంహరణ ♦ శారదనీరద విస్ఫురద్యశా
పురహర ధాతృపాకరిపు ♦ పూజ్యపదాంబుజ శ్రీజనార్దనా॥ ౯౬

ఉ॥ రామహరేదశాననవి ♦ రామహరే కరుణాభిరామ శ్రీ
రామహరేయటంచు మది ♦ రంజితవృత్తిస్మరించు వారునీ
ధామముఁజేరిచిన్మయతఁ ♦ దాండవమాడుచునుండి నీదుస
త్ప్రేమకుఁ బాత్రులౌదురఁట ♦ దీనజనావన శ్రీజనార్దనా॥ ౯౭

ఉ॥ పావనఁజేయ నీదయకుఁ ♦ బాత్రులెయుండరు నొక్కభంగిగా
గోవులఁగావవే శబరి ♦ కోరికఁదీర్పవె భద్రదంతినిన్
బ్రోవవె చట్టురాయుపువుఁ ♦ బోడిగఁ జేయవె యడవిఁజేరసా
లావృక సంచయంబులను ♦ లాలనసేయవె శ్రీజనార్దనా॥ ౯౮

చ॥ మదిఁగల చింతలంజెఱుచు ♦ మంచిగుణంబుల వైభవంబు సం
పదలనొసంగుఁ బాపములఁ ♦ బాఱఁగఁ జేయునిహంబునందుఁదాఁ
బదపడి మోక్షమిచ్చు హరి ♦ భక్తియఁటంచు గురుల్ వచింప నీ
పదముల నాశ్రయించితిని ♦ పాయఁగఁద్రోయకు శ్రీజనార్దనా॥ ౯౯

ఉ॥ చేసినపాపపుంజములు ♦ సెప్పఁగ లెక్కకుమీరెఁ బుణ్యమో
వీసమునైన లేదు మఱి ♦ భేషజముల్ కడుఁ బెద్దవయ్యెనా
దోసపుబృందముల్ దలఁచి ♦ త్రోయకుమయ్యవిపత్తులందునీ
దాసులలోన నేనునొక ♦ దాసుఁడనయ్య హరీజనార్దనా॥ ౧౦౦

ఉ॥ ముప్పునఁగాలకింకరులు ♦ మూఁగిన వేళను దూసనంబుదాఁ
దప్పులసంస్మరించి పరి ♦ తాపముఁజెందునుగాని యింతలో

నెప్పుడు దూరదృష్టికడ ♦ మిథ్యాదునాహృది మంచితోవకున్
దిప్పియుచుంచు దండనవి ♦ ధించుట మాన్పవె శ్రీజనార్దనా॥ ౧౦౧

ఉ॥ వారిజనేత్రనీదుపద ♦ వారిజయుగ్మము భక్తిమనత్కనో
వారిజమందునిల్పితిని ♦ వారకమామకపాత కౌఘముల్
దూరముచేయవేకరుణ ♦ తోడుతజూడవె కావవేహరీ
నారదకుంభజాది ముని ♦ నాయకవందిత శ్రీజనార్దనా॥ ౧౦౨

ఉ॥ ద్వారముఁజేరి మొఱ్ఱలిడు ♦ యాచకుఁగాంచియు వాడెపోవుఁగా
కూరకయున్న నంచుఁ దల ♦ యూచుచునుండు గృహస్థుపోల్కినీ
వారయఁజేయఁబూని యిటు ♦ లక్కటమానముఁదాల్చితోక్కనే
ధారుణినాథపోదునెచు ♦ తంద్రితభేకగళంబులీలనీ
తారకనామమెన్నక స ♦ దానుడు వేటికి శ్రీజనార్దనా॥ ౧౦౩

ఉ॥ చిక్కెనునీకథామృతము ♦ చేతులజుట్టఁగఁ గుక్షినిండఁగా
దక్కెనుమాకుఁబల్కఁగను ♦ తారకమంత్రము పెన్నిధానమై
సొక్కెనుమాయఘాటవిపి ♦ శుద్ధభవన్మహిమాగ్నితప్తమై
నుక్కెను మామనోవ్యథలు ♦ రూఢిగనీకృప శ్రీజనార్దనా॥ ౧౦౪

ఉ॥ స్నానజపాగ్నిహోమములు ♦ సల్పుటెఱుంగను వేదశాస్త్రవి
జ్ఞానమెఱుంగ సాధుజన ♦ సంగతిఁ జేయుటెఱుంగ యోగసం
ధానమెఱుంగనీబహువి ♦ ధంబుల నజ్ఞుఁడనైననాకు నీ
ధ్యానమొసంగి నీదుపద ♦ దానునిఁజేయవె శ్రీజనార్దనా॥ ౧౦౫

చ॥ పతితుఁడనైననన్నెలమిఁ ♦ బావనుఁజేయఁగనీవుదక్కవే
రితరులునాకు దాశరథి ♦ యిప్పుడునీవు నుపేక్షచేసినన్
గతియికలేదులేదునను ♦ గావుము నీదగుదీనరక్షణ
వ్రతముడిపోవనీకునగుఁ ♦ బాటగుగా దెహరీజనార్దనా॥ ౧౦౬

ఉ॥ సామముఖాగమప్రచయ ♦ సంచితసారము పద్మజన్మసు
త్రామముఖస్తుతంబునత ♦ దైన్యవిభేదనమై వెలుంగునీ
రామయటన్న నామముఁగ ♦ రంబునిరంతర తైలధారగా
నేమఱకే స్మరింపవర ♦ మీయవె రాఘవ శ్రీజనార్దనా॥ ౧౦౭

ఉ॥ ఆపదలంభయంపడెకు ♦ నప్పుడు రామయటంచుఁ బల్కినన్
బ్రాపుగనీవు లక్ష్మణుఁడు ♦ బాణశరాసన ఖడ్గపాణులై
దాపున కేగి గష్టముల ♦ తాపము మాన్పుదురన్న మాట నా
వైపునఁబోవకుండనిలు ♦ పందయచేయగదే జనార్దనా॥ ౧౦౮

ఉ॥ ఏవిభునామముం దలఁప ♦ నిమ్మహిలో సకలేప్సితంబులన్
ఠీవిగఁబొందఁగల్గునువ ♦ డిన్నరుఁడే విభుఁ డొందుఁ దుష్టి సం
సేవలచేత నట్టి నినుఁ ♦ జేరి స్మరించెద సేవకార్తి వి
ద్రావణవజ్రపంజరవ ♦ రా రఘుపుంగవ శ్రీజనార్దనా॥ ౧౦౯

చ॥ అడిగితి నొక్కమాట విను ♦ మయ్య రఘూత్తమ సావధానతన్
వడివడిఁగాలకింకరులు ♦ పాశభయంకర హస్తులై కడుం
గడకరుదెంచు వేళననుఁ ♦ గాచి త్వదంచిత తారకంబునా
కిడుమని కోరినాఁడ నిది ♦ యే మదభీష్టము శ్రీజనార్దనా॥ ౧౧౦

ఉ॥ దీనులఁగూర్మిఁగాచుటకు ♦ దీక్షవహించిన వాఁడవంచు నా
భామజమారుతిప్రముఖ ♦ భక్తజనంబులఁగాచితంచు స
ర్వానత దాసవర్గముల ♦ సన్మతిఁ జూతువటంచు మ్రొక్కితిన్
దానము నిమ్ము కోర్కివర ♦ దా రఘునాయక శ్రీజనార్దనా॥ ౧౧౧

ఉ॥ ఏమితపంబు సల్పిరొకొ ♦ యెట్టివినోములు నోచినారొ తా
ల్పాముల గోసలాత్మజయుఁ ♦ బంక్తిరథుండును తల్లిదండ్రులై

పే్రిమనునిన్ను, జెంచికదుఁ ♦ బెద్దగఁ జేసి కృతార్థులైరి శ్రీ
భూమిసుతాత్మలోల రఘు ♦ భూపనతావన శ్రీజనార్దనా॥ ౧౧౨

చ॥ కరమనురక్తి ద్రౌపదికి ♦ గౌతమునాతికి సూర సూతికిన్
వరవసనాళి రూపమును ♦ భాసురరాజ్యము నిచ్చితయ్యనీ
వరముల జెందినట్టి జన ♦ వర్గముఁ జెప్పఁగఁ జాలనన్ను న
క్కరణినిఁ బ్రోవవే కరుణఁ♦గావవె చూడవె శ్రీజనార్దనా॥ ౧౧౩

ఉ॥ వారక సర్వదుష్టపరి ♦ వారము నంతకు వీటికంపి భూ
భారముఁ బాపి సాధుపరి ♦ వారముఁ గాచి యశేషపావనం
చారముమాన్పి తత్వవర ♦ సారమునింపిన మజ్జగజ్జనా
ధారముజూపఁ బెక్కులవ ♦ తారములెత్తవె శ్రీజనార్దనా॥ ౧౧౪

దశావతారపద్యములు.

ఉ॥ ఆగమబృందముంగొనుచు ♦ నంబుధిమధ్యమునందు గూఢతన్
డాఁగినసోమకాసురున ♦ డంపఁగ మీనమవై పయోధిలో
వేగమవానినిందునిమి ♦ వేదములన్విధికిచ్చినట్టి స
ద్భాగుఁడవీవెకావెఖల ♦ దానవమర్దన శ్రీజనార్దనా॥ ౧౧౫

చ॥ ఉరుతరలేలిహానవరు ♦ యోక్త్రముగాఁ గొని మందరాగమున్
దరళసుమంథదండముగఁ ♦ దాలిచినిర్జరకర్బురుల్ పయ
శ్శరధిమథింపుచో ధరణి ♦ సంచలతంగనఁ గూర్మమైధరా
ధరమును నిల్పితీవెకద ♦ దైత్యవిమర్దన శ్రీజనార్దనా॥ ౧౧౬

చ॥ మదమునభర్మనేత్రుఁడస ♦ మానభుజాబల నైపుణిన్ ధరన్
జదరగఁజుట్టి మానవులఁ ♦ జంపుచుమీఱఁగ దేవసంఘముల్
ముదమఱికావు కావుమని ♦ మ్రొక్కుచు వేడవరాహరూపివై
కద[illegible]జంపి భువిఁ ♦ గావవెసత్కృప శ్రీజనార్దనా॥ ౧౧౭

చ॥ దిటముగఁ దత్సభాస్థలిని ◆ ధీంకృతపంచముఖోద్భవార్భటిన్
చిటపెట నుక్కుకంబమున ◆ వెల్వడి హుంకృతి దుర్భరాస్యసం
ఘటితమహాట్టహాసమునఁ ◆ గర్బురవక్షము వ్రియ్యగోరులన్
స్ఫుటముగఁ జీల్చి దాసుఁ గృపఁ ◆ బ్రోచు నృకేసరి శ్రీజనార్దనా॥

చ॥ బలమున దానవాళిబల ◆ వైరిని నొంచుచునుండ దేవతల్
చలితమనస్కులై శరణు ◆ సాధుజరక్షణ యంచు వేడఁగా
ధరణిని వామనుండవయి ◆ దానముగోరి రసాతలంబునన్
బలిని నడంచితీ వెశద ◆ భక్తజనావన శ్రీజనార్దనా॥ ౧౧౯

ఉ॥ క్షోణిపచక్రవర్తి నిజ ◆ గోహరణంబొనరింపనలియ
క్షీణబలప్రతాపముల ◆ జెండి కఠోరకుఠారధారఁ ద
త్ప్రాణములన్ హరించి నర ◆ పాలకులంబు నడంపవే జగ
త్త్రాణగుణప్రవర్తి భృగు ◆ రాడ్వరమూర్తి హరీజనార్దనా॥ ౧౨౦

ఉ॥ శ్రీరమ సీతయై తనర ◆ శేషుఁడు లక్ష్మణుఁడై యెసంగ శం
ఖాదులు శత్రుజిద్భరత ◆ తాఖ్యులుగాఁగ ముదంబుతోడ బృం
దారకబృందమా కపిక ◆ దంబముగా గనయోధ్య నేలుల
క్ష్మీరమణుండవంచును భ ◆ జింతు రఘూద్వహ శ్రీజనార్దనా॥ ౧౨౧

ఉ॥ నందునిమందయందు వ్రజ ◆ నందనబృందమునందమైన యా
నందము జెంది కొల్వఁగను ◆ నంబులఁ బొంగుచు గోపసుందరుల్
గందుఁడవంచు వెన్నగిలి ◆ కన్నవ విందని యాదరించి హా
లిందమకింపనొప్పెదు హ ◆ లిన్నినుఁ గొల్చెద శ్రీజనార్దనా॥ ౧౨౨

ఉ॥ సారసమిత్రవంశమున ◆ జాతుడవై శకలేశమందు మా
యారమసేసు తుండవయి ◆ యవ్యయవాదియనంబఁగ్లబెంచి

స్సారభవాంబుధిన్విడిచి ♦ సంయమి వాచ్యుఁ దథాగతుండవై
మీఱిన బుద్ధరూపివని ♦ మిమ్ముభజించెద శ్రీజనార్దనా। ౧౭౩

ఉ॥ అంచితవాజి పుంగవము ♦ నందుఁ గుదుర్పడి మ్లేచ్ఛతుచ్ఛరా
ట్సంచయు కంఠముల్ దెగివ ♦ డంగగృపాణికతాండవంబుచే
మించినతాళిఁగాచిధర ♦ మేదురధర్మము నిల్పఁబోవు ని
ర్వ్యంచితకల్కి రూపవరి ♦ పాలుడ వీవెగదా జనార్దనా। ౧౭౪

ఉ॥ పట్టితి మీపదాబ్జములఁ ♦ బట్టిన పట్టును వీడకుండఁ బోఁ
దట్టితిఁ బాతకావళులఁ ♦ దావకతారక మంత్రశక్తిచేఁ
బెట్టితి దూరమందుఁ బటు ♦ భీకరకాలభటాళి నేఁడహో
కట్టితి నీమబాటనని ♦ కంకణమున్ వడి శ్రీజనార్దనా। ౧౭౫

ఉ॥ శశ్వదనూనభక్తి విల ♦ సద్వికచోత్పలచంపకాళిఁదా
త్ప్రాక్ప్రశ్వయధోచితంబుగ ద్వ♦ దంఘ్రియుగంబునుఁబూజచేసితిన్
శ్రీశ్వరచిత్తగించి కొన ♦ వేహరిదేవర వంశజుండఁగా
మేశ్వరనాముఁడన్ దమకు ♦ నెప్పుడుదాసుఁడ శ్రీజనార్దనా। ౧౭౬



